# అమర గౌరవము

[శ్రీ పొట్టి శ్రీరాములను గూర్చిన కావ్యము]



ఆంధ్రరాష్ట్ర సిద్ధికై ప్రాణములు ధార
పోసి దివముఁ జేరఁ బోయినట్టి
ధీరుఁడైన పొట్టి శ్రీరాములెట్టి పూ
జ్యతను గనెనొ చదువుఁ డాంధ్రులారా!



కృతికర్త :

మోచర్ల రామకృష్ణయ్య.

నెల్లూరు.

ప్రాప్తిస్థానము :
మోచర్ల రామకృష్ణయ్య,
అడ్వకేటు.
'కవితానికేతనము'
అత్తితోట అగ్రహారము.
నెల్లూరు.



1953.
జులై.



వెల :
ఎనిమిదణాలు.

నెల్లూరు
భగవాన్ ప్రెస్సున
ముద్రితము.

# ఆశీస్సు



శ్రీ పొట్టి శ్రీరాములుగారిని నే నెఱుంగుదును. సంచి సంకకుఁ దగిలించికొని నెల్లూరి *'నగరజ్యోతి' కడ నడుగులో ండుగిడుచు నడచుచుండఁగా ఈయనను బలుమాఱు ేను చూచియున్నాను. హెచ్చరించుకొనియు నున్నాను. తర కాంగ్రెసు సభ్యుల భక్తివలె నీతని దేశభక్తియు సావధిక ునుకొంటిఁగాని ఈయనయం దది నిరతిశ యోత్కర్షము ాంచినదని నే నూహింపనేర నైతిని. మూలప్పేటలో నితఁ వసించి నప్పుడును, ఏదేని వ్యాజమునఁ దద్దీక్షనుండి రమింప నవసరము నిరీక్షించుచుండు వ్యక్తులలో నీతఁడు ొక్కఁడు కానోపునని తలంచితిని గాని, ఈతని దేశభక్తి యింతగాఢ మని నే తెలియనైతిని. తెలిసియేయున్న, నమ స్కారార్హుఁ డైన యీపూజనీయునితో ప్రాయోపవేశాదిక ముంగూర్చి వినోదంపు మాట లాడి యుందునా? వ్యళీక భాష ణములు కావించి యుందునా? శ్రీరాములవారు సత్వరాంధ్ర రాష్ట్ర సిద్ధికై చెన్నపురిలో ఉపవాసమునకుఁ దొడంగినపుడును

---

★ఇది, ట్రంకురోడ్డులో తప్పగజా సుబ్బయ్య సత్రము ప్రక్క పశ్చిమాభిముఖముగా నున్న యొక్క కుడ్యభాగము పేరు. దీనిమీఁద దైనందిన పత్రికా వార్తలు లిఖింపఁ బడుచుండును. ఈ పద్ధతిని (mural news-catering) రష్యాదేశీయులు సైత మనుకరించు చున్నారు.

అట్లే భావించితిని. కడపటి దినములలో ప్రాణములు లేచి పోవనున్నపుడును ఎందఱెందఱో ప్రముఖులు వారించినను దాఁగొన్న దృఢదీక్ష వీడక బొట్టు బొట్టుగా నోడలి రక్తమును, శకలశకలముగా దక్కిన ధాతువులను యోగాగ్ని కర్పించు చున్న యీ త్యాగమూర్తింగూర్చి వింతపడఁ జొచ్చితిని. 'నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః' అను పవిత్రోక్తి యిట్టిపట్లను సమన్వితమగుచున్నందుకు వెఱ గందితిని. ఎట్టి విపత్తులలోను బ్రాణము కాపాడుకొన నుద్యమించుట మానవ స్వభావమని మన స్తత్త్వవేత్తల (Psychologists) సిద్ధాంతము. ఇతఁడు ఆనియతింగూడ సంకల్ప బలముచే నతిక్రమింపఁ గలిగెనే! ఏదో ఆకస్మిక భావోద్రేకమున నసువులం దొఱంగుట లోకమున అప్పుడప్పుడు కానవచ్చుచుండును. ఇది యట్టిదికాదు. ఎఱిఁగి యెఱిఁగి, తెలిసి తెలిసి, కడపటి కఠినపు దినములలో తన్నుఁ బ్రాయోపవేశమునుండి మరల్ప వలదన్న యీపురుష సత్తముని యద్భుత నిశ్చయము ఏమని కొనియాడవలయును? ఈతనితో పూర్వాపూర్వము గావించిన యసంగత ప్రసంగములకుఁ బశ్చాత్తప్తుఁడనైతిని. బాహ్యమునుబట్టియే మనుష్యుల యంతరంగముల పావిత్ర్యము నిర్ణయించుట కష్టమని గుఱితించితిని. కాని నా అనుతాపము నెట్లు తెలుపుకొనుట? ఇతఁడు మన మాట లందుకొనుచోటు దాఁటిపోయెనే! కావున నాకుం బ్రియ మిత్త్రుఁడు నన్నుగురునిగా భావించు చిరంజీవి 'సాహిత్యరత్న' మోచర్ల రామకృష్ణకవి వీరి కఠోర నిష్ఠంగూర్చి యొక కబ్బమే

వ్రాయుచున్నానని యెఱిఁగించినపుడు నాకుఁ గలిగిన హర్షము నకు మేరలేదు. ఏతద్ గురుకార్యము నేననుకొన్న దానికన్న మిన్నగా నెఱవేర్చుచున్న యీ 'ప్రసన్నమధుర' కవికి మిగులఁ గృతజ్ఞుఁడనైతిని. ఆ ఖండకావ్యము వారిభావనా సికషమున నొఱపిడిగొని నేఁడు ఈ తెఱంగున వెలువడుచున్నందుకు నేను ఉప్పొంగుచున్నాను. దీని సముద్రిత స్థితియందే 1953 జూన్ 28వ తేదీనాఁడు నాయుడుపేట పౌరాభ్యుదయ సమితిపక్షమున జదివి — ఈకవి వస్త్రభూషణాది సత్కారములకు భాజన మయ్యెనని విని యెంతో సంతోషించితిని. ఈ కృతి ముందు ఇట్టి సన్మానముల నెన్నింటిఁ జూఱగొనునో కదా! ఈపరిణతికి మెఱుంగు పెట్టినట్లుగా నాయొద్దఁ గలాశాలలోఁ జదివిన యిర్వురు పూర్వ విద్యార్థులే దీనిఅచ్చొత్తించుటకు అత్యంత సంతుష్టుఁడ నగుచున్నాను. వారు (1) చి॥ శ్రీ దేవతా చెంచురాఘవయ్య, బి. ఏ., బి. ఎల్., అడ్వకేటు (అధ్యక్షులు, టౌన్ కాంగ్రెసు, నెల్లూరు.) (2) చి॥ శ్రీ పెనుబోలు రాధాకృష్ణ గుప్త, యం. ఏ., యల్. యల్. బి., అడ్వకేటు. ఈ ముప్వురు మిత్త్రిములకు పరమే శ్వరుఁడు యథోచితము ఉత్తమ కార్యములు సేయుటకు వలయు నాయురారోగ్య భోగ భాగ్య వైదుష్య విభవము లొసంగుఁ గావుత మనియు ఈదివ్య సమ్మాన కృతి లోకమున 'అమర గౌరవ' మందు గావుత మనియు ఆశీర్వదించుచున్నాను.

నెల్లూరు.
5—7—1953

దుర్భా. సుబ్రహ్మణ్య శర్మ.

# అమరగౌరవము

"శ్రీరాములు గారూ! కై
వారమ్ములు మీకు, మీయపార తపశ్శ్రీ
ధౌరంధర్యమ్మునకున్
ధీరత్వమ్మునకు ధర్మదీక్షారతికిన్! 1

మెచ్చెన్ రత్నవిమానమిచ్చి నను బంపించెన్ బలారాతి, మీ
రిచ్చో జాగొనరింప రాదిఁక, దివిన్ బృందారకవ్రాతముల్
రచ్చల్ సేయుచు నున్నవారలు పవిత్రంబైన మీమూర్తిఁ దా
మిచ్చన్ జూడఁదలంచి, యిచ్చకముగాదీమాట; నేమాతలిన్" 2

అని దేవేంద్రుని సారథి
వినయము తళ్కొత్తఁ బల్క, విహసితకలితా
ననుఁడయి శ్రీరాములు చ
ప్పున మాతలి ముందునడిచి పో వెన్నంతన్. 3

వెలువడిరి వారు భవనంబు, వింతకాంతు
లీను మహనీయ రత్నవిమానమొకటి
కుదురుకొని యుండె నెదుటనె-కదిసి తెఱచె
తత్కవాటమ్ము మాతలి తత్క్షణంబు. 4

శ్రీరాములు లోనికిఁజని
హారి మణి స్థగితమైన యాసనముపయిన్
జేరెన్ - మాతలి మూసెన్
ద్వారము, నెలకొనియెఁ దాను దన స్థానమునన్ 5

వ్యోమరథంబునందుఁ బదముంచిన యానిముసంబునందె శ్రీ
రాములు దివ్యదీప్తి రుచిరంబగు దేహమునొందె, వాని నె
మ్మోము సుధామరీచి పొలుపుం బరిభూత మొనర్చె, వాని దృగ్ధా
మములయ్య భాస్కరునికాంతులకు న్నగఁ బొల్లుగూరిచెన్. 6

దేవవిమానమంత సముదీర్ణ జవమ్మున మింటికెక్కి వా
గ్దేవత యానమట్లు పరుగెత్తఁ దొడంగెనుఁ జాకచక్యపుం
జేవ యెలర్పఁ దారకల సీమలనంటుచు, మబ్బుగుంపులన్
ద్రోవలొనర్చుకొంచు, శపురూపపుశంపల కోర్చి పేర్చుచున్ 7

ఆవిమానమట్లు దేవలోక ప్రాంత
మునకుఁ జేర, సురసమూహ మర్థి
స్వాగతం బొసంగె నాదరోత్సాహవి
న్యాసముల వినూత నాగతునకు. 8

అమరావతీ పురద్వా
రమున న్నిల్చెన్ విమానరాజము, కౌతుభు
క్కమనీయ దుందుభిధ్వా
నముల పరంపర లెసంగి నాకము నిండెన్. 9

ఎలమి రాజమార్గముల కిరువైపులఁ
జాల్వారైన వేల్పు సముదయముల
జయజయారవములు సంధిల్ల, గంధర్వ
గణమొనర్చు గానఘణుతు లలమె. 10

రంభ తెఱచె దేవరథము తల్పును హొయల్
మిగులఁ దన మెఱుంగు చిగురుఁ గేల,
వెలికివచ్చె నాంధ్రవీరుఁడు గంభీర
పూజ్యమూర్తి కేలు మోడ్పుతోడ. 11

మిసిమిమాణిక్యకాంతుల మించు పళ్లె
రమున మేనక యిచ్చె నీరాజనంబు
నగుమొగమ్మెత్తి; మఱితోరణమ్ము గట్టె
భాసురస్వీయ దృక్కైరవ వ్రజమున. 12

శ్రీరాములు చేరువకపు
డైరావతమెక్కి వచ్చి యమరేశ్వరుఁడో
పూరుషసత్తమ, రావో
యీ, రమ్మనియతనిఁ జెంత కెక్కించుకొనెన్. 13

చోదంతిసాగిపోయె, శ
చీ దయితునితోడి యాంధ్రసింహునితో, నా
హ్లాదముతోఁ జనిచని, దార
యాదేశ మెఱింగి నిలిచె నదియొకచోటన్. 14

నముచిసూదనుఁడై రావణము విలాస
లలితగతిడిగ్గి, శ్రీరాములను డిగంగఁ
జేసి, యాతనికేలూని యాసమీప
మందుఁగల యొక్క మందిర మతఁడు సొచ్చె. 15

మందిర ద్వారమందుండె మగువ యొకతె
పతివియోగార్తయని యామెవదనభంగి,
మేనిచందము, చూపులలోనివగపు,
చింతయుం జీకు చెప్పక చెప్పుచుండె. 16

ఆ చిరంటిని జూచి యిట్లనియె నింద్రుఁ
'డమ్మ! దయచేసినాఁడు నీ ప్రాణ విభుఁడు,
మృతి యెఱుంగని యశము నార్జించి వచ్చె
నేలుకొనుమింక నీజీవితేశు నీవు.' 17

ఈ పలుకులు విని తన విభు
నాపైదలి చూడఁగలిగినంతనె బాష్ప
వ్యాపృతముఖియై యిరువురి
శ్రీ పాదమ్ములకు శిరసుఁజేరిచి మ్రొక్కెన్. 18

అట్లు మ్రొక్కిన యాసాధ్వి నమరవల్ల
భుండు దీవించి యచ్చోటినుండి కదలి,
స్వీయపరివార యుక్తుఁడై చేరి నగరు,
కలిత హర్షమ్ముతో శచిం గలిసికొనియె. 19

శ్రీరాముల పత్ని సునా
సీరుఁడు వీడ్కొన్న కొంతసేపటి కెటులో
తేలుకొని లేచి, గాఢ ప
రీరంభము విభునికిచ్చి ప్రేముడి హెచ్చన్ 20

లోనికిఁగయికొని పోయి, ప్ర
యాణశ్రమవాయ గోష్ణమగు సలిలమునన్
స్నాన మొనరింపఁజేసెన్,
పైనముగ సుసంస్కృతోదనము వడ్డించెన్. 21

తనకు నేఁటికి జిరకాలమునకు దొరకెఁ
బుణ్యాసహాధర్మచరి చేతి భోజనంబు,
తోడరి శ్రీరాములెంత కుతూహలంపుఁ
బెంపున భుజించినాఁడో యూహింపఁదగును. 22

ఆరగించి లేచి, యతివ యందిచ్చిన
కమ్మకప్పురంపు దమ్ములమ్ము
హాయిఁ జర్వణమ్ము సేయుచు సుఖశయ్యఁ
జెందె నాఁత డువిద చెంత మెలఁగ. 23

హృద్యసంశ్లేష సంగతైకైక భుజులు
అవిరళిత గండభాగు లయ్యాలు మగలు
చెలఁగి క్షేమమొ ముచ్చటల్ సెప్పుకొనుచుఁ
దివిరి యాలోన భల్లునఁ దెల్లవాఱె. 24

సరవి వారు కాల్యకరణీయములఁ దీర్చు
కొని, నిశాంతమెడలి, చని, ఘుపాంత
మునఁ దనర్చు నొక్క మోహన వార్మ్యతో
రణము ఁజొచ్చి సంబరమ్మొలర్ప. 25

చనుచుండ నిష్కుటంబునఁ
గనఁబడెఁ గస్తూరిబాయి కాంతామణి, పూ
చిన సుమవల్లుల కడ ని
ల్చినదై పుష్పాపచయము సేయుచు ఁబెల్చన్. 26

ఆ పవిత్రచరిత చూపు శ్రీరాములు
గారిమీఁద వారి దారమీఁదఁ
బడుటతోడ, నామె పరమనమ్మోద వి
స్ఫారితాక్షియగుచు ఁజేరవచ్చి. 27

వారు వెంట నరుగు దేర లోనికిఁబోయి
యాఁగె నొక్కచోట - నట మనోజ్ఞ
మైన కృష్ణ విగ్రహం బొండుచూ పట్టె,
నొక్కజ్యోతి వెలుఁగుచుండె నచట. 28

అచ్చట గాంధి మహాత్ముం
డుచ్చైః స్వరమునను ఁజదువు చుండెను గీతన్,
విచ్చిన వీనుల విజ్ఞులు
సచ్చరితులు భక్తి పరవశత వినుచుండన్. 29

శ్రీ మహాదేవ దేశాయి శిష్యభావ
మొప్పఁ జేరువ (గూర్చుండి గొప్ప గొప్ప
సంగతులు వ్రాసికొనుచుండె సంగ్రహించి,
యెందఱో యుండి రాగోష్ఠియందుబుధులు. 30

ఆ మహనీయమైన సభ కాభరణంబయి వెల్గు సాత్త్విక
శ్రీ మహితాత్మునిన్ విబుధశేఖరు గాంధిని డాయఁబోయి, త
త్కోమల పాదపద్మములకున్ బ్రణమిల్లిరి భక్తియుక్తి, శ్రీ
రాములు తత్సతీమణియు ద్రష్టలు గద్గదపాటు నొందఁగన్. 31

అప్పు డనఘుఁడు గాంధిమహాత్ముఁ డట్లు
తనకు మ్రొక్కిన వారెవ్వరని ముఖేందు
వెత్తి శ్రీరాములనుగని యిట్టిదని వ
చింపరానట్టి ప్రీతి జృంభింప నెనఁగి 32

భగవద్గీతా పఠనము
దిగనాడి "పవిత్రమైన దినమిది, మిత్రుం
డగు మా శ్రీరాములుగా
రగపడుట మహావిశేష"మని యుత్సుకతన్. 33

లేచి శ్రీరాములను గౌఁగిలించి యతని
కరము కరమునఁగీలించి కన్నుదోయి
నుండి యానందబాష్పసముత్కరంబు
లెడల నిటుఁబల్కె మాటలు తడఁబడంగ. 34

పరహితఫలమ్ము నర్థించి స్వార్థముడిగి
యసువులను ధారవోయువా రవనియందు
నిన్నుఁబోలిన మానవులున్న వారె!
దేవతవుగాని నరుఁడవుగావు నీవు. 35

అట్టినినుఁ బ్రాణవిభునిగాఁ గట్టుకొనిన
యీమహాసాధ్వి దేను మ్మదృష్టమన్న,
హర్ష వార్నిధి నోలాడుటయ్యె నేఁడు
మాన్యులను మిమ్ముఁ బుణ్యదంపతులఁగనుట" 36

అని యిటు లా జాయాపతు
లను మెచ్చెను సకల సభ్యులకుఁ బరిచయముం
బొనరించె నేతదభినం
దన వాక్సూనముల జల్లునను దేలించెన్. 37

అంతట శ్రీరాములు త
త్కాంతయు శ్రీగాంధియాజ్ఞఁగై కొని తగ ని
ష్క్రాంతులయి విడిదికిం జని
స్వాంత మ్ములరంగ సరస సల్లాపములన్ 38

తవిలి రుచిరాన్నములు దిని
దివిషత్సుందరుల సొంపుఁ దేవపురీ వై
భవముం గూరిచి నెలఁత
కవ్వ వతో ముచ్చటలు చెప్పుకొనుచున్నతఱిన్. 39

"ఓ మహనీయులార! భరతోర్వి జనించినయట్టి పొట్టి శ్రీ
రాములుగారు పుణ్యు లమరావతికిం దయచేసినార, లా
గామిడి తెల్గువీరునికి గౌరవపూర్వక పూజసేయ, సు
త్రాముఁడు కొల్వుదీరెడు-సుధర్మకు రండిపు డీరలందఱున్. 40

ఇది దేవేంద్రుని యాజ్ఞ, రావలయుఁ జుండీ, లెండు, రండిప్పుడే
త్రిదశావాసులు మీరలంద "అని సందేశంబు దూతల్ పదిం
బది చాటించిరి దుందుభిధ్వనులతో స్వర్వీథులన్-వెంటనే
మది పొంగన్ సురసంఘ మేఁగెను సుధర్మాసంగతాస్థానికిన్. 41

కుధరవైరి కొల్వుకూటమ్మునకు బ్రహ్మ
ఋషిగణములు దేవఋషులు విబుధు
లల్ల నాకసాను లందఱుఁ జేరిరి
పూవుఁదోఁట నళులు మూఁగునట్లు 42

స్వర్గలోకవిభుని సభయది - ముప్పది
మూఁడుకోట్ల వేలుపులకె కాక
అన్యులంతమంది యరుగుదెంచిర యేని
చోటొసంగు కొలువుకూట మద్ది. 43

ఆ యాస్థానములోనికిఁ
బోయెడువా రెంతమంచి పుణ్యాత్ములొ, వా
రా యాలయపున్ లోపలి
సోయగముం గాంతు రేని చొక్కుదు రెపుడున్. 44

అట్టి యుక్కడంపుఁ గట్టడమయ్యును
గంబ మొక్కఁడేని గానరాదు,
వలయగతి నమర్పఁ బడియున్నవచ్చోట
భాసమానమైన యాసనములు. 45

లక్షలుం గోట్లుమించునీలముల గుములు
విడుపుఁ దోఁపింపనీక తాపింపఁబడిన
యందమొగు చందువా యందు పొందుపఱచి
నట్టివజ్రమ్ము లుడురాశి నవఘళించు. 46

మెఱయుచున్నయట్టి మేల్కట్టు నడిమి భా
గంబునందు రత్నకార్ముకంబు
సంతతంబు శబలకాంతు లీనుచు వేల్పు
ఱేని ధనువు ననుకరించు చుండు. [illegible]

అమర వల్లభు నపదానకము లనూన
కళ గుబాళింపఁ గుడ్యభాగముల మీఁదఁ
జిత్రితములై విలోకుల చిత్తములను
బంది గొనుచుండు విదితపూర్వమ్ములయ్యు. 48

వారక వృత్రాసుర సం
హారములో నున్న పట్టులన్నియుఁ జూడన్
గోరిన వారు సుధర్మా
హారి కళా కుడ్య సీమలం దరయఁదగున్. 49

పరమభక్తునిగావ, దేవతల నోము
రూత్కమైనట్టి నరహరి రూపమొంది,
హేమకశిపుని బరిమార్చి, యింద్రపదవి
నాదుకొన్నట్టి దేవు నం దరయవచ్చు. 50

భ్రాత వెతఁ బాప నదితి గర్భంబునందు
వామనుఁడుగా జనించి, దుర్వారుఁడైన
బలిని నిర్జింప బ్రహ్మాండ మలమికొన్న
ప్రోడ దృశ్యమ్ము నచ్చోట జూడ వచ్చు. 51

అట్టి దివ్యసభకుఁ బొట్టి శ్రీరాములు
పోవ హేతువైన పుణ్యమెదియొ,
ఎట్టి లగ్నమందుఁ బుట్టెనో యాతండు
తెలిసికొన్నవారు గలరె నరులు! 52

తెలుఁగువీరుని విడిదికి దేవవిభుఁడు
స్వయముగాఁబోయి యుచ్చైశ్శ్రవమ్ముమీఁద
నెనయ నాధీరు నెక్కించుకొని యథోచి
తాభినవగౌరవములతో నరిగ సభకు. 53

శత్రుతో నిక్కువీనుల జక్కనెక్కి
వచ్చు శ్రీరాముల శిరస్సుపయి మర్త్య
సుందరులు సల్లు సంతాన సుమ సమూహ
పరిమళవు సౌరు భూనభోంతరము నిండె. 54

వేల్పు ఱేఁడు సభకు విచ్చేయుచోఁ బ్రస
త్తిల్లు గౌరవంపుఁ దెఱఁగు లెల్లఁ
దేజరిల్లఁ గొలువుదీరె శ్రీరాములు
గారు సవిధపీఠిఁ గూరుచుండ. 55

ధాత్రికిఁగవితాసుధాభిక్ష తొలుదొల్త నిడినవాల్మీకి ఋషీశ్వరుం
డు, పంచమ వేదసంపదను విశ్వంభరకిచ్చిన వ్యాసమునీశ మౌళి,
భారతీయకళావతార మితండన్న వాసిఁగాంచినకాళిదాస సుకవి
తనమోముఁగనినవారిని మోఱకులనైన బుధులఁ గావించెడి
భోజరాజు,

మున్నగు మహానుభావులు మొదటి పజ్క్తి
నెలమినుచితాసనమ్ముల వెలుఁగుచుండి
రాకృతులఁగొన్న వేదవేదాంగ సకల
శాస్త్ర విద్యలుగాఁ దద్ధాని యందు. 56

పాణినియుం బతంజలియుఁ బాష్కర సాదియు నగ్ని వేశ్యుఁడుఁ
బాణుఁడు రాజశేఖరుఁడు భారవి చోరమయూరముఖ్య గీ
ర్వాణకవి ప్రకాండులు తపస్వులు శౌనకశాకటాయనుల్
నాణెపు రాణతో దివిజనాథుసభన్ దులకించి రయ్యెడన్. 57

లలితపదుండు దండి-బహుళప్రతిభాకృత శబ్దచిత్రని
ర్మలరసభావ బంధురుఁడు మాఘుఁడు- సౌందరనంద కావ్యకృ
త్కులపతి యశ్వఘోషుఁ డనఘుల్ జయదేవ మురారిముఖ్యసూ
రులు సురభారతీకవివరుల్ గనుపట్టిరి తత్సభాస్థలిన్. 58

ఓటునడక వేదములనుండి ఛందస్సు
నుద్ధరించినట్టి యుక్కలుండు
పింగళుండు—వానివెంబడి నమర సిం
హుండు గూరుచుండి రొక్కపక్క. 59

కవియై మాంత్రికుఁడై కళాజనిత లోకఖ్యాతుఁడై తెల్గునే
లఁ విరాజిల్లిన యుల్లసన్మతి బుధశ్లాఘ్యుండు నాగార్జునుం
డవధానస్థితిఁ గూరుచుండె నొకచో నాత్మీయసమ్మానన
వ్యవసాయమ్మును దేవతాళిసుమనోభావమ్ము నీక్షించుచున్. 60

అపరశంకర విఖ్యాతి నందినట్టి
దతఁ డద్వైతి యప్పయదీక్షితుండు
పంచశతికర్త యగు మూకపండితునకుఁ
బ్రక్కఁగూర్చుండె భక్తుల పంక్తియందు. 61

ప్రణుతాభిఖ్యుఁడు నారా
యణతీర్థుఁడు కృష్ణవర్ణనానంద పరా
యణుఁ డుండెను భక్తశిరో
మణి లీలాశుక మనీషిమాన్యుని సరసన్. 62

అతనివామభాగమందుఁ గూర్చుండియుం
డెను మహానుభావుఁ డనఘమూర్తి
మహితపుణ్యకీర్తి మధుసూదన సరస్వ
తీ సమాహ్వయుండు ధీవరుండు. 63

శకపూరుషుండుగా శాశ్వతుండైనట్టి విక్రమాదిత్య పృథ్వీధవుండు
తజ్జేతయై జగత్ప్రఖ్యాతిఁగన్నట్టి సాహసాంకుఁడు శాలివాహనుండు
తన యేలుబడి యిట్టిదని తెల్పు పేరుతోఁ బరిఢవిల్లిన హర్షవర్ధనుండు
ప్రాణి పవిత్రత పాటించి మనుగడ సాగించిన యశోక చక్రవర్తి

చారురత్నాసనములలోఁ గూరుచుండి
చూచుచుండిరి-సుకవి సంస్తుతుఁడు కృష్ణ
దేవరాయలు వారి సదేశమందె
యొప్పెఁ బెద్దనకవి వానియొద్ద నెసఁగ. 64

తత్సవిధాసనస్థుఁడయి ధార్మికుఁ డాంధ్ర కవిత్వనేత వి
ద్వత్సముపాసమాన్యుఁడు శుభంయువు నన్నయభట్టు మించె న
త్యుత్సుకతన్, దదీయకృతి నోమిన రాజనరేంద్రుఁ డావిప
శ్చిత్సురలోక నాయకుని చెంత వసించె నుదంచితద్యుతిన్. 65

ఆతని యంతికంబునఁ బరాంతక విక్రమసింహపట్టణ
శ్రీతరుణీశుఁడౌ మనుమసిద్ధియు వానియమాత్యుఁ డాంధ్రవా
గ్భూతల కుండలీంద్రుఁడు ప్రబుద్ధుఁడు దిక్కనసోమయాజియున్
జేతములుల్లసిల్ల విలసిల్లిరి జిష్ణుఁడు జీవుఁడుం బలెన్. [illegible]

గండఁడైన గౌడడిండిమ భట్టును
వాదమందు గెలిచి వా[illegible] [illegible]
[illegible] నట్టెట్టి శ్రీనాథభట్టార
కుండు వారి పజ్జఁ గూరుచుండె. 67

చిటిపెద్దప్రభుఁ డయ్యుపాంతముననే చెల్వొందఁ గూర్చుండెఁ, న
చ్చోట శోభిల్లెనొగిన్ బ్రబంధ పరమేశుం డెఱ్ఱనార్యుండు, చెం
గట బ్రహ్మణ్యుఁడు పోతనార్యుఁడు జగద్గణ్యుండెల ర్చెన్, గుఱిం
గటరంగార వెలింగి రన్నమయుఁ ద్యాగబ్రహ్మయుం జెల్వొనన్.

భారతభూరమా హృదయపద్మ సుగంధము విశ్వభారతీ
చారు శిఖావతంసమునఁ జక్కనిమిఱ్ఱి దిగంగనా కళా
గారములన్ సువాసితముగా నొనరించిన శ్రీ రవీంద్రతా
కూరు కవిప్రభుండు సొబగుల్ వెలయన్ వెలుగొందె నొక్కెడన్

కను చూపు మేర వఱకున్
గనఁబడి రొగి నెందఱో సకల విద్యావ
ర్ధనులగు పండితకవుల
య్యనఘుల పేర్లెన్న నస్మదాదుల వశమే! 70

తగ భద్రాచలరామదాసు-తులసీదాసుండు-వేదాంత పా
రగుఁడౌ వేమన, పోతులూరుకుల వీరబ్రహ్మమున్ సమ్మదం
బిగురింపన్ గనుచుండిరొక్క యెడఁ, దారింకొక్క చో నూర్జితుల్
ప్రగుణుల్ భారతదేశభక్తజనముల్ వర్తిల్లి రుల్లాసులై. 71

పాంచాలభూవనీ పంచాననుండని ప్రథఁగన్న లజపతిరాడ్విభుండు
వాదనమిదరింగ పాండమధ్యముండైన మోతీలాల్మహాశయుండు
శ్రీమన్మహారాష్ట్ర శివగిరీశుండైన యోధుండు బాలగంగాధరుండు
వంగమండల ధర్మవాదివిద్వజ్జన కుంజరుండగు చిత్తరంజనుండు

విశ్వవిఖ్యాతదాత నాగేశ్వరుండు
త్రాసమెఱుఁగని యాంధ్రరత్నం బనంగ
వన్నెఁగన్నట్టి మేటి గోపాలకృష్ణుఁ
డొక్క వరుసన కూర్చుండియుండి దెలసె. 72

దంటలైన పటేలుసోదరుల నడుమ
శూరకులమౌళి బోసు కూర్చుండియుండె,
వారిచేరువ వేంకటప్పయ్యగార
లరయుచుండిరి కనుఱెప్పలార్పకుండ. 73

తేజుగలిగివెలుఁగు తెలుఁగు సీతారామ
రాజుగార లప్పరాయ ధన్వి
తోడఁ గూరుచుండి తోడియాంధ్రకుమార
వరుని మేలురాక నరయుచుండె. 74

వారిసరస ధర్మవర్తనుఁ డాచార
పరుఁడు భరత మాతృ చరణ భక్తి
దోహలుండు మదన మోహన మాలవ్య
పండితుండు గూరుచుండి యుండె. 75

వాతెరనుండి వెల్వడిన వాక్యములన్నియు జానుకైతలై
శ్రోతల చిత్తవిత్తములఁ జూఱ గొనంగలవై యొసంగె నే
నాటికి, దేశమాతృనయనద్వయదీప్తి యెవర్తు జీవిత
జ్యోతి, సరోజినీరమణి శోభిలె నవ్విరిబోణి యొక్కెడన్. 76

శ్రీమదిగ్రమలత్ముబై మనిన లక్ష్మీబాయి రుద్రాంబలుఁ
రామధ్యాన ముకుందగాన పరమానందాబ్ధులం దోఁగు ఆ
ర్యామత్తల్లిక లైన మొల్లయును మీరాబాయియుం దత్సభా
శ్యామాశ్రేణి నలంకరించిరి సముద్యద్దీప్తులఁ జిమ్ముచుఁ. 77

చెలువల తలమానికమై
యలరెఁ గస్తూరిబాయి, యామెదరిఁ వ
ర్తిలె శ్రీరాముల యిల్లాల్
నిలువెల్లఁ గనులు గలుగు లేమ విధానఁ. 78

ఆసీనుఁడయ్యెఁ బ్రత్యే
కాసనమున గాంధి — పీఠ మది యెట్టిదియో
యా సౌమనస్య విభవం
బా సౌరు వచింప సాధ్యమగునె నరులకుఁ. 79

అమరేశ్వరుండు కార్య
క్రమముఁ సాగించు వేళ కావచ్చుట స
భ్యమహాశయులెల్లరు శ
బ్దము సేయక వినిరి వజ్రధరు వాక్యములఁ 80

అప్పుడు వేల్పురాయఁడు నయమ్ము విలాసము మాటవాసియుఁ
జొప్పడఁ బల్కెనిట్లు "గుణశోభనులార, సదస్యులార, యో
యొషిలకుప్పలార! యొకయోగ్యుని మన్ననసేయు వేడ్కమై
యిప్పగిదిఁ మిముం బిలుచుటెల్లరకుఁ విదితంబ కొల్వులోఁ 81

మాననీయుండు నేఁటి సమ్మాననమున కై
వఁడుపాత్రుండౌ యాధీర వరుని గూర్చి
యొకఁడు యుక్తప్రశంస సేయుటయు దాని
నాలకించుట యలరుట మేలు మనకు. 82

తలఁపులలోఁ బలుకులలో
మెలఁకువయుఁ మెలపు గలుగు మిన్నను దివిష
త్కులగురుఁ దెలుతును శ్రీరా
ములఁ గూర్చి యుపన్యసింపఁబోలు నటంచున్" 83

అని వాచస్పతిపై సహస్ర నయన వ్యాకీర్ణ నిష్కల్మష
ప్రణయోదంచిత భక్తి గౌరవరుచుల్ వ్యాపింపఁజేయన్ గురుం
డనిదంపూర్వచమత్కృతి ప్రవణవాక్ప్రారంభ శుంభత్తరం
గిణిలో నందపు డోలలం దునిచి యూగించెన్ సభాస్తారులన్. 84

"భరత భూపురంధ్రి బంగారు కడుపున
ప్రభవ మందినట్టి ప్రజలయందుఁ
బేరుపెంపుగలుగు బిడ్డ లుక్కరులు ము
క్కోటి లెక్క తెలుఁగు కొలముపారు. 85

వారిచేల ప్రక్కఁ బ్రవహించు నక్షయ
క్షీరతటినియైన కృష్ణవేణి,
గౌతమీ పినాకినీ తుంగభద్రాత్రి
కమ్మ వారితల్లి కంఠసరము. 86

అరయ భారతీయ హైందవులేకాదు,
సురలు గూడ నరిగి పరమభక్తి
నెవనిఁ గొలుతురట్టి యేడుకొండలసామి
యాటపట్టు తెలుఁగునాఁటి యందె. 87

అమర సరస్వతి గాంభీ
ర్యము సర్వము చూఱలాడి నట్టిది - లాలి
త్యమునకుఁ బెట్టిన పేరై
యమరిన యది వారివాణి యాంధ్ర మనంగన్. 88

శివ షడక్షరీ మనువుతోడ నక్షరా
భ్యాసమునకుఁ దొడఁగి వ్రాసినడరు
తెలుఁగువారి సంస్కృతికి సాటికాఁగల్గు
నట్టిదెందు జగతియందు లేదు. 89

కమనీయద్యుతిధామమై తనరు దక్షారామ భీమేశలిం
గ ముదీచీదిశయందు, దక్షిణమునన్ గాళేశ్వరక్షేత్రలిం
గము- మాన్యాకృతిఁ బశ్చిమంబున నుదగ్రశ్రీగిరి ప్రోల్లస
ద్భ్రమరాంబాంకిత శంభులింగము మహాంధ్ర త్ర్యారమాలక్ష్యముల్.

తమ వాఙ్మౌక్తిక రంగవల్లికల సౌందర్యంబు పెంపొందు పే
రిమిచందంబుల, నాంధ్రదేశజనయిత్రీ దేవతాగారకు
ట్టిమముల్ నెట్టనఁ జక్కవెట్టుకొనఁ, బాడింబంటయుం నీటికూ
టములం గూర్చుకొనంగఁ, గోరికి స్వరాష్ట్రిం బాంధ్రభూమిజనుల్,

వీరి ప్రత్యేక రాష్ట్ర మనోరథమున
కఖిలభారత దేశనాయకులసమితి
ప్రాపుఁ గల్పించి దానిసాఫల్యమునకు
వాటమగుబాటఁజూపింప మాటయిచ్చె. 92

పడమటి దీవులం దునికి పట్టులు గల్గిన వెల్ల మోము వం
గడముల వారియేలుబడి కష్టతమస్విని యంత మొందఁగాఁ,
గడిమి స్వతంత్రభారత జగద్ధితమైన ప్రభాత వేళ నె
క్కుడుతమి వారు రాష్ట్ర మొసఁగుండని వేఁడిరి *దేహళీశులన్ 93

కెరలి భారతీయ కేంద్రప్రభుత్వంబు
కాపురించు దేహళీపురమున:
ఏతదీయ కేంద్ర నేతృత్వ సంపత్ప్ర
కాశపరులె దేహళీశు లరయ. 94

దేహళీప్రధాని తెలుఁగు వారలఁ జూచి,
యిరుగుపొరుగువారి హృదయమెఱఁగి
వారి యిచ్చగింత మేరకు వర్తింతు
రేని మీకు రాష్ట్రమిత్తుననియె. 95

ఇది పొసఁగని పనియైనన్
బదకం బోకభంగి కుదురుపడకుండు నె య
న్నది గదురఁ బంపకమునకుఁ
బదపడి నూల్కొనిరి తెలుఁగుఁవా రఱవలతోన్. 96

*దేహళి = ఢిల్లీ

పొందు పొసఁగకుండు పోడిమి యేర్పడె
నఱవ సోదరులకు నాంధ్రులకును,
జెన్నపురము తెలుఁగు సీమలోనిదియంచు
వీరు-కాదటంచువారు పోర. 97

మీలోమీరలు మీ వివాదముల నెమ్మిం దీర్చుకోలేనిచో
నేలాగాంధ్రుల రాష్ట్రసిద్ధియగు? నేనేభంగి మీవాదముల్
హాళిం దీర్పఁగలాఁడ, నంచు జవహర్‌లాల్ మంత్రి వాక్రుచ్చుచున్
గాలంబుం గడపెన్, దెలుంగుల మనః కామ్యంబు ఖర్వంబుగాన్.

తమ చిరకాంక్షితంబు దవుదవ్వులఁబోవ, నిరాశ నిండెఁ జి
త్తములందమస్సు మెండుకొనె, దైన్యముహత్తుకొనెన్, స్వతంత్రతా
ద్యుమణిని జూచి కట్టుకొన యోజన సల్పిన రాష్ట్రహేమ సౌ
ధములవి గాలిమేడల విధంబునఁ దోఁచెను స్వాప్నికంబులై. 99

ఈ పరిణామముం గనిన యీడ్యుఁ డితండు పినాకినీ పవి
త్రాపగఁ దీర్థమాడి, విమలాశయుఁడై కవితిక్కయజ్వకుం
బ్రాపగు దేవుఁడౌ హరిహర ప్రభు నాత్మఁ దలంచి, తత్కృపా
దీపిక తోడుగా బయలు దేరెను జెన్నపురంబుఁ జేరఁగాన్ 100

ఈ పురుషోత్తముండు జనియించిన ప్రోలది-యాంధ్రనైగమ
వ్యాపృతిచేతనే బహుళభాగ్య సమున్నతి వన్నెకెక్కి యు
ద్దీపిత రూపమేర్పడఁ బ్రతిష్ఠఁగడించిన రాజధాని యి
ప్డాపుటభేదనం బహితయామికరక్షితమై మెలంగెడున్. 101

విమతాచార్యకపర్యవస్థ గల యాపీఠిం బ్రవేశించి వా
సమునెక్కొల్పెను సాంబమూర్తి కరుణా సంపత్తి, నేతన్నివే
శమె యోగ్యంబగు యజ్ఞవాటమునుగా సల్పెన్, దురాధర్షుఁడై
క్రమమేపార నపూర్వమైన మఖ మారంభించె నీతండొగిన్ 102

ఇల నధికారమున్నను, మనీషయు వాక్చతురత్వమున్న, మం
డలపతులైన. మంత్రులయినన్, దమధర్మ మొనర్పకున్న, వా
రల కొఱ యెత్తి చూపుదురు ప్రాజ్ఞులు స్వార్థమునుజ్జగించి, భీ
తిల రొక లేశమైనఁ దమదేహము పోకకు మిత్తిరాకకున్. 103

"తెలుఁగుల రాష్ట్రవాంఛ కవధీరణముం గలిగించు చేష్టలున్
బలుకులు యోచనల్ సలుపు వారెవరైనను ధర్మదూరులే,
బలియులు దేహళీవిభులుః పాడియుఁ జక్కటియుంగ్రహించి యాం
ధ్రుల యభిగమ్యకాంక్ష కనురూపవిధుల్ నెఱవేర్చుటొప్పగున్.

బహుభాషాప్రజలున్న చెన్నపురమున్ బ్రత్యేక రాష్ట్రింబుగా
రహియింపన్ సమకూర్చి, తద్వరపురీ రాజత్కలా మాలికా
స్పృహణీయ ప్రియ సంపదన్ సకల సంసేవ్యం బొనర్పందగున్,
గుహకం బన్యవిధావలంబనము, కాకోలంబ యాంధ్రాళికిన్ 105

ఆంధ్రజాతికి భారతీయ ప్రభుత్వ
సచివ వర్గంబు రాష్ట్రిం బొసంగకుండ
కాల హరణం బొనర్చిన కలుష మెల్ల
మండి మసియాత నా హోమ కుండమందు! 106

ప్రతిభయుం బట్టుదల గెల్గువారె యైన
ఒక్కఁడొక త్రోవఁబోవ నింకొకడు వేఱు
తెరువునం బోవుతీంద్రఁడంపుఁ దెలుఁగు తెవులు
పసుపు నాయజ్ఞ వహ్నిలో భస్మమగుత! 107

దివికి సత్యధర్మ దేవతల్ గాంధీమ
హాత్ము వెంటనంటి యరిగినారు,
గాన ధాత్రి నిల్వఁగా రాదు, వారి నే
దేవలోక మరిగి తెచ్చువఱకు" 10౮

తన యాశయముల నీ విధ
మునవెల్వడఁజేసి, యితఁ డమోఘారంభం
బున నిరశన నియమమ్మునఁ
బొనరించెఁ గ్రతువు నాంధ్రభువి మేలునకై. 109

'క్లిష్టమ్ములగు రాజకీయసమస్యలు కటికి పస్తులఁ బరిష్కారమగునె?'
'ఒక్కఁడీతండు ప్రాయోపవేశమొనర్చి తెలుగురాష్ట్రం
బుసాధింపఁగలఁడె?
'రాలునటయ్య మంత్రాలకుమామిడికాయలు? వీనికీకస్తియేల?'
'ఒక్కొక్కఁడిట్లు కూడుక్కఁ బట్టిన, జంకు దొరతనం
బదియెట్లు జరుగునొక్కొ?'

అంచు నంచించి భాషించి యగ్గలించి
మందెమేలమొనర్చిరి మందలించి
రెక్కసక్కెములాడి రనేకగతులఁ
దన్నిరాహార దృఢదీక్ష విన్నవారు. 110

'కుడుపుక్ మానితి వేమిదీక్షయిది? యోగ్యుల్ యున్మా
దాదుల్ వృథా
బెడదక్ జచ్చుట మేలటే? బ్రతికి యుర్వీక్ మానవానీకపుం
గొడవల్ గొన్నిటినేని దీర్చుటది మీకుం బూరుషార్థంబు: మా
నుఁడు మీపట్టని చెప్పిరాయనకు మాన్యుల్ స్నేహితుల్
బంధువుల్ 111

ఈ మార్గంబున నెందఱాయనకుఁ దా మేమిబోధించినన్
నేమంబున్ లవమేని వీడక సముస్మేషించి, ధైర్యక్రియా
హేమాహార్యుఁడతండు సంశయము సుంతేనిన్ మదిం బూనకు
ద్దామంబైన స్వకీయ నిశ్చయము నుద్ఘాటించె నీ తీరునన్ 112

"నేనెవ్వండనుకొంటిరో,విడుఁడు భ్రాన్తిన్, దేహముంగాను: మో
హోనన్ మీకెటుదోఁచు: సత్యముగ నిత్యప్రత్యగాత్ముండ: నీ
మే నేమైన భయంబు నొంద, నది భస్మీభూతమై పోయినన్
బోనీ! నాదు ప్రతిజ్ఞ తప్పదునె మిన్నుల్ మేదినిన్ రాలినన్! 113

ఏ నొనర్చుకార్య మిదిక్రొత్త పద్ధతి
యేమొ యనుచు సంశయింపవలదు,
తనువుఁదొఱఁగలేదె దాక్షాయణీదేవి
మున్ను జనకునింట బన్నమొంది. 114

నశ్వరంబైన కాయంబు నమ్మికొన్న
వారెఱుంగుదురే యాత్మబలము మహిమ?
నిష్కలంక తపోయోగ నిరతుఁడైన
వాని కిలలేవు సాధింపరాని పనులు. 115

నా సంకల్పము నిష్కలంకమగుచో, నానిష్ఠ యక్షీణదీ
క్షాసంపన్నమై యైనచో, జరుగు నాజన్నంబు నిర్విఘ్నమై.
ఈ సత్యాగ్రహ పుణ్యయజ్ఞఫలమై యేర్పాటగుంగాక ల
క్ష్మీ సందీప్త మహాంధ్ర రాష్ట్రమెవరాక్షేపించినన్ నవ్వినన్ !"

అని ప్రకటించి యాఘనుఁడు స్వాత్మబలమ్మును నమ్మి, జీవయా
త్రను ముగియింపఁజొచ్చె సముదగ్ర పటువ్రతుఁడై, నిమేషముల్
సనియెను, గాఢ్లేగె, వరుసన్ గడియల్ మఱి జాములుం గ్రమం
బున జరిగెన్, దినమ్ములనుబోయెఁ గ్రమించెను వారముల్ వెసన్!

భుక్తిన్ మానెనుగానఁ దొల్తఁదల నొప్పుల్ వెన్క బ్రాల్మాలికల్
వ్యక్తంబయ్యెను-డస్సెనంగములు-వాగ్వ్యాసంగముల్ గ్రుంగె-ని
ర్ముక్తాత్మాప ఘనాభిమానుఁడు వ్రతారూఢాత్ముఁడౌ వానికిన్
రక్తక్రవ్య వసావిశేషములు క్షీణంబయ్యె నానాఁటికిన్. 118

అయ్యది నిశ్చయంబుగ మహత్తర యజ్ఞము-యోగవహ్ని నా
యయ్య స్వకీయమైన హృదయంబున నుద్భవమొందఁజెస్నెఁదా
నొయ్యన వ్రేల్వఁగాఁదొడఁగె నొక్కొక యించుక ప్రాణరూప సా
న్నాయ్యము, చెంత యాజకగణంబులు స్వాములుహోతలారయన్

నమ్మికలేని పెద్దనవనాగరకంపు జనమ్ముగూడ బృం
దమ్ములుగా విచిత్రము గనన్ జనుచుండి, రుదగ్రహోమ ధూ
మమ్ములు సేతు శీతనగ మధ్యధరాతలమెల్ల నిండి పో
నిమ్మెయి సాగిపోయెనది యేఁబది యెన్మిదినాళ్ళయజ్ఞమై 120

ప్రేల్చెన్ ప్రాణహావిస్సు పూర్తిగ,జగద్వీరుం డధర్మంబులన్
గాల్చెన్, దెల్లుల రాష్ట్రసిద్ధియను సంకల్పంబు సాధింపఁగాఁ
బెల్చెన్ నిల్చి యజించి గాత్రసుమమున్ విశ్వంభరా దేవిపై
రాల్చెన్‌ఁ, జేరఁగవచ్చె నిచ్చటికి శక్రవ్యోమయానంబుపై. 121

కోరఁడు స్వప్రయోజనము-కొంకఁడు గాటపు గాసికిన్ మహా
ధీరుఁ డతండు-తెంపున నదీ సలిలంబుల దూఁకిరో, విషా
హారము నారగించిరొ హతాశులు మేను పరిత్యజింతు, రా
మేరకుఁ దాను జేకొనిన మృత్యువు గాదది తత్త్వమారయన్ 122

దీమస మొప్పఁగాఁ దనువు దీప్తశిఖానలమందు వైచిరో,
భూమిధరాగ్ర మెక్కి-పడి బొందిని ప్రమందఁగఁ జేసి డిందిరో,
పామరు లాత్మహత్యలకుఁ బాల్పడుచుందురు - దిట్ట పొట్టి శ్రీ
రాములుగారి చర్య యదిరా, యది దుర్ఘట కార్యమారయన్ 123

ప్రజలు తపించిరి, సకలాం
ధ్ర జగమ్మొక యగ్నిపర్వతముగా మారెన్,
గజిబిజిఁ గల్పించు మృతి
ధ్వజినీ శరవహ్నిఁ జిమ్మె దశదిశలందున్. 124

కనుగందని నవజీవిత
కుసుమచయం బేతదీయ ఘోరంబగు నై
శనమున మసిగాఁగ రుషా
వ్యసన ద్వేషముల గాలి వానలు రేగెన్. 125

కలయం గనుఁగొని ' శ్రీరా
ముల యాత్మత్యాగ మిన్ని బూమెలు వన్నెన్
జ ల మేల సేయ? నసువుల
బలి యిచ్చిన యతని రాష్ట్రవాంఛ నొనర్తున్' 126

అని మనమ్మున నిశ్చయమ్మునకు వచ్చి
ప్రజల ప్రతినిధి సభకుఁ గేంద్రప్రధాని
తెలిపె నాంధ్రభక్ష్యమా రాష్ట్రదేవి విజయ
విజయదశమికి నావిర్భవించు నంచు. 127

ప్రావృణ్మేఘోదయమున
నే విధమునఁ దప్తపృథివి హ్లాదింపుఁ గనునో,
యావైఖరి నాంధ్రావని
యీ వార్తా కర్ణనమున నెలమింగాంచెన్. 128

ఈ విజయ విజయ దశమికి
నావిర్భావంబు నొందు నాంధ్రుల రాష్ట్ర
శ్రీ - విజయేందిర సుమ్మది
వే విధముల వాసిమెఱయ వృద్ధిం బొందున్." 129

అని యీరీతి బృహస్పతి
తన వాఙ్ముఖమును ముగింప, దైవతపతి సూ
చనచే శ్రీరాములు గా
రిని రంభాద్యమర సుందరీతతి కొల్చెన్. 130

హేమకంకణ నిక్వాణ మెసక మెసఁగ,
రత్ననూపుర నినదసంరంభ మొప్ప
రంభ గజరాజగమన విరాజమాన
యరిగి పన్నీరుసల్లె నయ్యానఘుమీఁద. 131

చారు దోర్మూల కూలంకష స్తనముల
వ్రేలు ప్రాలంబికల రుచుల్ వ్రేళ్ళ నున్న
యూ ర్మికల కాంతితో వియ్య మొందఁ బోయి
మురువులూరంగ శశిరేఖ బొట్టువెట్టె. 132

హాస మిగురింప, నలిన పట్టాంశుకమ్ము
జిలుఁగుఁబయ్యెద జాఱంగఁ జేరవచ్చి,
సౌరభోద్గారి దివ్యమందారమాల
దిద్దె నూర్వశి తత్కంఠ దేశమందు. 133

అలరు విల్తుని సమ్మోహనాస్త్రములకు
జీవ మిచ్చెడు మంత్రాధిదేవతలుగఁ
జెప్పనొప్పు తిలోత్తమాచిత్రరేఖ
లామహాశయు వీచిరి చామరముల. 134

మేనక నాట్యమాడెను దమిన్, మృదుగీతిక నాలపించుచున్,
దాని మనోజ్ఞమైన చరణద్వయ విన్యసనంబు తీర పా
థోనిధిలో తరంగముల తోరపుభంగుల నంగవించెఁ, ద
ద్గాన కళాసముద్రము సదస్యులముంచెను యోగనిద్రలోన్.

అమ్మగువ యాట ముగిసిన
పిమ్మటయును గొంతసేపు విబుధాధిపు కూ
టమ్మున జి త్తరువుల చం
దమ్మున గూర్చుండి రాసదస్యగణంబుల్ 136

అమర విభుండు తేలుకొని యాంధ్రమహాశయుఁ జూచి, సభ్యసం
ఘముఁ గని పల్కెనిట్లు 'గురుగౌరవ వాగమృతంబు గ్రోలినా
రము-మన మేనకా సురుచిర స్ఫుట నాట్యము సూచినార, మా
రమణి యమేయ గానమున రంజిలి నార మపూర్వవైఖరిన్. 137

ఇఁక నేఁ జెప్పందగినది
యొకటియుఁ గనరాదు గాని, యుష్మదనుజ్ఞా
ప్రకటిత మతి నొక వరమీ
యకలుష చిత్తున కొసంగ నభివాంఛింతున్'. 138

అన విని సభ్యులెల్లరు తథాస్తని, రంత సురేశ్వరుండు సం
జనిత సముత్కట ప్రమద సంభృత సంభ్రమ వాగ్విలాసుఁడై
మునుకొని పల్కెఁ'నో యనఘ మూర్తి భవన్మహనీయ దీక్ష నా
మనము హరించెఁ నిత్తు బహుమానము నీకు వరమ్ము వేఁడుమా!'

ఈ మాటలు విని, వినయము
మోమునఁ దొల్కాడ లేచి, ముకుళిత కరుఁడై
కోమల భాషణముల శ్రీ
రాములు దేవేంద్రుఁ గూర్చి రహిఁ బ్రార్థించెన్. 140

"ఓ సురసార్వభౌమ! వరమొక్కటి యీయఁదలంచినారు నా
కీ సమయంబునందు-నచియించెద నామదిలోని కోర్కెః సు
శ్రీ సముపేతమై గుణగరీయసియైన మహాంధ్ర రాష్ట్ర ల
క్ష్మీసతి కే సుతుండ నగు మేలు వరంబు ననుగ్రహింపుఁడీ! 141

మీ కృపకల్మి నాకమున మేమెయి నాకును నాదుపత్నికిన్
జేకుఱె పీఁటపట్టు-నరునిన్ నను బిన్నను బెద్దఁజేసి, యీ
లోక సమాదరించితిరి-చొక్కపు భక్తి నమస్కరించు టే
కాక యొనర్పఁ గల్గినది కల్గదు నా కిఁక పాకశాసనా!' 142

అనుటయు వేల్పుఱేఁడు పరమాదర మొప్ప వచించె నిట్టు "లో
మనుజవరేణ్యా! నీమనసు మాటలు చేఁతలు మాననీయముల్!
తనువుఁదొఱంగి, ధారుణి తలంబును వీడి, దివంబుఁ జొచ్చి, యీ
యనువున మన్ననల్ వడసి యీరఁ వరంబిటు వేఁడు వాఁడవే!

స్వర్గమున కన్న నాంధ్ర దేశంబె నీకు
నీటుగా లగ్గుఁ గూర్చెడి నెల వటోయి?
ఇచట మిన్నేటిలోఁ గ్రుంకు లిడుట కన్నఁ
బెన్న స్నానంబె మిన్నయై యున్నె నీకు! 144

మా యమరావతీ ద్యుతియు, మా యమరీ రమణీయ రూప శో
భాయత వైభవమ్ము సరియాటకుఁ జాలవెఁ తెల్గునాఁటి స్థా
నీయ విశేషకాంతి కమనీయతకున్, మఱి యాంధ్ర సుందరీ
శ్రీయుత కోమలావయవ రీతి మనోజ్ఞతకున్ మహాశయా! 145

ఈ వడిగ్గిన వెనువెంటనె
యావరము నొసంగినాఁడ, నమరావతిలో
నీవును నీసతి వాసము
గావింపుఁడు కోరినంత కాలము సుఖులై. 146

నీపడఁతి మేటి క్రొత్తడి -
యాపెకుఁ బ్రాణమ్మునీవె - యాసతియె సదా
నీపత్ని యగుత, గుణని
క్షేపంబు లరుంధతీ వసిష్ఠులు మీరల్! 147

నా జోహారు లివే గ్రహింపుము; వరేణ్యంబైన యాంధ్రత్వపుం
దేజోమూర్తివి నీవు - క్రొత్తవరముల్ నేనిత్తు నీకిప్పుడ
వ్యాజంబైన పవిత్రమైన భవదీయ స్వార్థరాహిత్య దీ
క్షాజన్యాత్మ విసర్జనంబునకుఁ గాన్కల్; ధీరచూడామణీ! 148

ఏ యభిమతములతో నీ
వాయజ్ఞమొనర్చినావొ యవి సకలమ్ముల్
పాయక ఫలియించుఁ జుమీ
ప్రాయః పౌరుషఁడ వీవు వలచిన భంగిన్ 149

అచిరకాలమ్మునకె యబ్బునయ్య మీకు
రమ్యమైన విశాలాంధ్ర రాష్ట్రలక్ష్మి,
దినపరార్ధపునీడ సాదృశ్యమంది
సల్లలితలీల నామె వర్ధిల్లుగాత! 150

మీ విశాలాంధ్ర రాష్ట్రీయ దేవి సుతులు
రామరాజ్యమ్ములోనున్న ప్రజల సుఖము
లెస్సగ ననుభవించుచు లేనివారి
కొసఁగి ధర్మంబు వృద్ధిసేయుదురు గాత! 151

తగ్గుమొగ్గులులేని విద్యావివేక
విభవవిస్తారులై దైవభీతి గలిగి
భారతీయ సనాతన ప్రాభవంబు
చదురు లాంధ్రులు పెంపు సల్పుదురుగాత! 152

తెనుఁగుం దేశము స్వర్గం
బునుమించుంగాత! సురసమూహము లోలిన్
బనివడ సుఖపడ నాంధ్రా
వనిలో నెలఁకొనఁగ వలసవత్తురు గాతన్! 153

శుం

తత్సత్.